క. ఉపచితఘనరాగుఁడ నే । నపాంగవిఘ్నాంధకార మడఁచి కరమునన్
జపలాక్షి కేల్గ్రహింతునొ । తపనుండు సరాగనళినితామరవోలెన్. 31

(ముందుచూచి) ఇదె యుపవనద్వారము. నేనిందుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి తొట్రుపాటు నభినయించి నిర్వేదముతో) ఇది సమప్రదేశ మయినను నాయడుగు తొట్రుపడుచున్న దేమి కారణము? కాని. ఇక్కడనే కూరుచుండి దేవిని బ్రసన్నురాలిం జేసికొనియెదను (దోసిలిపట్టి)

ఉ. పంచలపాలుగా భీకరపాణి, కుబేరుఁడు పాలిభీరుఁడై,
కాంచఁగ నిల్లు డోఁ డోడలఁ గంపము శూలియు నూలఁ దూలి వే
యంచుల వాలుజోదు పారయం బలుబాములు, సైఁప కన్మరా
త్రించగు మస్త మేడ్త్రల మథించిన దేవిపదంబు గొల్చెదన్. 32

(సశ్లాఘముగా నాకాశమున)

ఉ. తోడివయస్యయౌ విజయతో సగసోక్తుల నింక మానకే,
జోడుగ నొద్ద నున్న శశిచూడుని మోమునఁ జూపుఁ ద్రిప్పకే,
పోఁడిగ నెత్తునం ఘనమణిభూషయు గల్గన బ్రోఁగకుండఁ జెం
డాడితె నద్రిజా! మహిషుఁ; నంబ! యి దేమి విలాసమో గదా. 33

(నిమిత్తమును సూచించి)

తే.గీ. ప్రియసమాలింగనము నీకు బెరయు దింక । నకట! దక్షిణబాహువా! యదరె దేల?
యొయ్యఁగ వే మల్లికాఘుటనైక హేతు । వైనగగనోత్థకరివాక్యబు నీవు? 34

(నిశ్వసించి యాకాశమున)

తే. గీ. అయనిర్వ్యాపకన్యకానర్ఘరత్న । మల్పసుకృతుండ నగు నాకు నబ్బమి తగుఁ;
గాని త్వద్వాక్యమే కదా దాన మూల । మంబ! నీకరుణార్ద్రిత కద్ది తగునె?

అయినను స్వకర్మాధీనసుఖదుఃఖుండ నయిన నేను భగవతి నీ కాత్యాయని నుపాలంభించ నేల? ప్రియతమురాలు లభింపమింజేసి నా జీవితము నిష్ఫలము గావున స్వయము సమ్మానితంబులయిన కుసుమంబులచే కాత్యాయనీమహాదేవి నర్చించి సంతోషపెట్టెదను. (మరల నాకాశమున) ఓ కాత్యాయని!

తే. గీ. ప్రణతకామితమందారవల్లి! తల్లి! । యనుఁగుఁజెలి నాకు మల్లిక యబ్బదేని
నాదుహస్తాసిలూనకంఠంపుమోము । గనుమిపుడు నీపదములఁ గోకనదముగను.

(కత్తిదూసి సప్రార్థనముగా)

తే. గీ. పద్మపాటల మైన నీపదములందు । దేవిరో! నాకు భక్తి వర్ధిల్లుఁ గాక;
యనుఁగుమల్లికతోడ జన్మాంతరంబు । నందు నైనను సంగమ మబ్బుఁ గాక.

(ఖడ్గము కంఠమునం దుంచుకొనుచున్నాఁడు)

(ఆకాశమున) హా! నాథ! మారుత! రక్షింపుము రక్షింపుము. రాక్షసహస్తమునం దిట్లు చిక్కియున్న నన్నేల చూడవు? మొట్టమొదట మత్తేనుఁగుహస్తమునుండి నన్ను విడిపించి బ్రతికించినవాఁడవు నీవే కావా? హా! యంబ! గౌరి! నేను సత్యముగా నే రాక్షసహస్తమునఁ జిక్కఁబడితిని. హా! తండ్రి! హా! తల్లి! యిదిగో! గౌరీప్రసాదలబ్ధ యయిన మీయేకపుత్త్రి మల్లిక చెల్లిపోవుచున్నది. హా! మాతృసమానురాల! భగవతి! మందాకిని! యిదిగో! నేను నీయాశ్రమపుసమీపమునకే తేఁబడినదానను అమ్మా! నామీఁది ప్రేమచేతనే గదా నీవు హిమగిరిని విడిచి పెట్టి యిచ్చోటికి విచ్చేసితివి! హా! సఖి! వనమాలిక! హా! కాళింది! మీదర్శనమింక నాకు దుర్లభము గదా! (ఖడ్గము కంఠమునుండి తీసి సాశ్చర్యాభిప్రాయములతో) ఏమది! మల్లికాస్వరము కరుణాకరముగా గగనగోచరమగుచున్నది!

[విషాదవితర్కములతో]

ఉ. ఆకసమింప మేపయి నభ్రము మించని కొంచుఁబోయెనో?
నాక మలంకరింప సురనాథుఁడు వేలుపులఁ బంపించెనో?
ప్రాకటభూష చంద్రకళ గాఁ దలఁచి గిరీశుఁ డెత్తెనో?
యాకసమం దిటుల్ కురరియై విలపించెడు భీరు వేమొకో? 38

(పైకిఁజూచి) అన్నన్నా! యెంతప్రమాదము

సీ. గుండె జల్లనుపల్లకోరమీసంబులు వేలుజుంజులు రాగవెండ్రుకలును
ముడివడ్డబొమలమోమును, బెద్దలకోరలు కలుగు దేరినవంక మెఱుఁగుఁగోల
లు నెఱ్ఱగ్రుడ్డులు గల్గి వ్యోమంబు నదరుచు మబ్బులతోఁ జుదిషయనుఁ డెవఁడో?
తెలిసె నిశ్చయము; రాత్రించరుఁడు వీఁడు. ప్రకాశించుచున్నాఁడు. దైవ మెంత
యాపదఘటించె! నవె నానయంకశలమునుండి ప్రభ్రష్టయగుచుఁ బయోధరంబు
వలనఁ గ్రక్కున మెఱుఁగుఁదీఁగయునుబోలెఁ బడెడుమల్లికఁ గనుఁగొనఁ దాళఁజాలకున్న హా హా!

(కన్నీళ్లతో) హా! విధాత! నిష్కరుణాత!

చ. మునుమును నేనె నేన యని బోటులు చేతుల నూఁత యీయ, సో
పనములదారి నైనఁ గటిభాగమునన్ మెలమెల్ల డిగ్గనం
గన గగనంబునుండి వడిగాఁ బడు, గాంగఝరం బెకల్చి చి
మ్మినచవుదంతిచేతిబలిమిం బడుబంగరుఁదమ్మితీఁగనాన్. 40

ఈమెను నేను బడకుండఁ బట్టుకొనియెదను. (ఖడ్గము క్రిందఁ బెట్టి చేతులు వెలికిలఁ బయికెత్తుచున్నాఁడు)

(తెరలో) ఎవఁడో యీయువు చెల్లినవాఁడు నాయుత్సంగమందలి యీనవకన్యను దొంగిలించినాఁడు. వానియొడిలో నప్పడఁతి యిప్పుడు కనఁబడ కున్నది. నే నొక్కయుఱుకున దానిని సింహళద్వీపముఁ జేర్ప నాలోచించితిని.

(ఇద్దఱు వినుచున్నారు)

మారు—(నవ్వి) అహా! దేవీప్రసాదమున నిమె నా చేతిలోఁ బడినసంగతి యీమూర్ఖరాక్షసుఁ డెఱుంగఁడుగదా!

మల్లి—(భయముతో) అయ్యో! రాక్షసుఁడు మరల వచ్చుచున్నాఁడు. (వడఁకుచున్నది)

మారు—(నవ్వి) సుందరీ! భయపడకు. క్షణమాత్ర మాచెట్టుచాటున నుండుము. ఈ చెనఁటిరక్కసుని నేను జెండాడెదను.

మల్లి—అయ్యో! మహాకాయుఁ డైనరాక్షసునితో నాథుఁ డెట్లు కలయఁబడునో?

మారు—(నవ్వి) భీరువా! మహాకాయుఁ డయిన నేమి?

తే.గీ. చండదుస్సహవీర్యతేజస్వి తొరఁగఁ జేయుగ పరవస్తు స్థూల్య సుబల!
యంబుజపుఁగెంపుఁ గని కట్టియుడగు నగ్గి బూది సేయునె కొండ మ్రుచ్చుకవాని?

మల్లి—(భయముతోఁ జెట్టుచాటున నున్నది)

మారు—(కత్తిదూసి గర్వముతో నిలఁబడియున్నాఁడు)

(తరువాత వెదకుకొనుచు సంభ్రమముతో నాక్రోశముగా రాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు)

రాక్ష—

శా. నే నాసింహళదేశకాననపథిన్; దీర్ఘద్రుమవ్రాతముల్ గా
లూనన్ భ్రామితకూటశాల్మలి భయం బొందు న్మహావ్యాఘ్రముల్;
స్త్రీ నంకస్థను గోలుపోయి వికటగ్రీవాసురుఁ డోర్చునే?
నా నాతిం గయికొన్నయన్నరుఁ డెటు న్నాఁడే గతాయుండికన్.

మల్లి—(భయముతో) అయ్యో! భయంకరశరీరుఁ డగువీనితోడఁ గువలయదళకోమలాంగుఁ డయినమహాభాగునకు సంగరం బెత్తెఱంగున జరగునో గదా!

మారు—(చూచి విస్మయముతో)

మ. శిర మ్మభ్రంకషతుంగశైలనిభ మీక్షింతుర్ సముద్దీప్తులై;
యురముం బ్రస్థవిశాలభీషణము తాలోత్తాలముల్ బాహువుల్,

నోహరాంగ! హా! సుజనచూడామణీ! హా! పుండరీకలోచన! హా! లక్ష్మీవిహారభవన! హా! మల్లికాహృదయవల్లభ! హా! మారుత! సర్వలక్షణలక్షితమైన నీకమనీయవిగ్రహము రాక్షసాహారమగుచున్నదా నాథా? అయ్యో! నేనెంత పాపాత్మురాలను! ఎంత యదృష్టహీనురాలను! కట్టా! దైవోపహతురాలను గదా! సర్వానర్థములకు మరల మరల నేనే కారణమగుచున్న దానను. (నిట్టూర్పు పుచ్చి) నా బ్రతుకింక నిరర్థకము. అయ్యో! మరణము కూడ నాకు దుర్లభమయినది భగవతీ! భూతధాత్రి! నాకు వివరమిచ్చి నీలోనికిఁ దీసికొమ్ము. కటకటా! సకలభువనమును గాలాంజననిభమయిన కటికిచీఁకటి క్రమ్ముకొని యున్నది నేనెక్కడికిఁ బోదును? ఎవ్వరికి మొఱ్ఱ వెట్టుకొందును? హా! దిక్కుమాలిన దాన నయితిని గదా! (రోదనము చేయుచున్నది)

(తోట్రుపాటుతో మందాకిని ప్రవేశించుచున్నది)

మందా—బిడ్డా! భయపడకు. భయపడకు.

మల్లి—(చూచి కన్నీళ్లతో) అమ్మా! భగవతీ! భగవతీ! రక్షింపుము రక్షింపుము.

(పాదముల మీఁదఁ బడుచున్నది)

మందా—(సకరుణముగాఁ గౌఁగిలించుకొని)

చ. తెలిసితి జ్ఞానరూప మగుదృష్టికతంబున, భీరురాల! మీ
యలవ్యసనానుబంధము సమస్తము; కస్తిని బొందకింకిటన్;
విలయము గండ్రు రక్కసులు; వేఁగు చీఁకటి విచ్చుమిగ్గగున్;
దొలఁగును రేయి; దైవము దోడగుఁ; గ్రమ్మఱ భద్రమయ్యెడున్. 57

మఱియు మారుతుఁడు రాక్షసహస్తగతుఁ డయ్యె నని సంతాప పడకుము.

తే. గీ. భవ్యశౌర్యవిడంబితసవ్యసాచి। మారుతుఁ బరాభవింపంగ లేరసురులు;
ప్రాక్కుధరజృంభమాణాంశుబాలభాను। దట్టపుఁజీకువా లరికట్టఁగలదె?

(తెరలోఁ జటచటధ్వని)

మందా—(చూచి యానందముతో) మారుతపరాక్రమ మెఱుఁగనిదానా! మల్లికా! మహాభాగునిచండిమము చూడుము.

క. మూఁపుననుండి భయంపడ। కోపిశితాశనునిశిరము నతఁ డనిఁ దునిమెన్
నైపునఁ గరికుంభము వ। జ్రోపమనఖరాంకుశమున యువహరి వోలెన్. 58

మల్లి—(హర్షముతోను భయముతోను జూచుచున్నది)

మందా—(ఆనందముతో)

చ. అనిహతమస్తకుం డగుచు నద్దిర! బిట్టుద్రుమనం ధరాతలం
బసురుఁడు వజ్రఘాతదళితాద్రితటంబును బోలెఁ గూలెడున్;

(ఆశ్చర్యముతో)

విస్మృతపుఁదత్కబంధమున వెల్వడి యుజ్జ్వలభూషణుండు మిక్
దెసఁ బురుషుం డొకం డహహా! దివ్యశరీరము దాల్చి యేగెడున్. 54

మల్లి—(విస్మయానందములతో) భగవతీ! యిది మహాశ్చర్యము! అతిభీషణుం డగు రాక్షసునివలన దివ్యపురుషుఁడు బయలు వెడలినాఁడు. చూడు చూడు. ప్రదక్షిణము చేసి మౌళిప్రదేశసంఘటితాంజలిపుటుండయి మహాభాగునకు నమస్కరించుచున్నాఁడు.

మందా—(ఆలోచనతో) ఎవఁడో దివ్యపురుషుఁడు శాపవశమున రాక్షసుఁ డయ్యె నని తలంచెదను.

(తెరలోఁ గలకలము ఇద్దఱును వినుచున్నారు)

మల్లి—(భయముతో) భగవతీ! రాక్షసపక్షమునం జేసి మఱల రాక్షసుండే వచ్చుచున్నాఁడని తలంచుచున్నాను.

మందా—(చూచి) బిడ్డా! యిదిగోఁ గన్నీరు విడుచుచున్న నీతండ్రి నమాత్యవిశ్వవసునిఁ బురస్కరించుకొని నిన్ను వెదకుచు బెడిదపుఁ గైదువులు గైకొని వీరపురుషు లిటు నటు సర్వత్ర దిరుగుచున్నారు.

(మఱలఁ దెరలో) హా! పుత్త్రీ! మల్లికా! యింద్రదీపికాకాంతముఁ జూచి కూడఁ జీఁకటి యని జడిసెడుదానవుగదా తల్లీ!

మల్లి—(కన్నీళ్ళతో) అయ్యో! నాకుఁగా నేడ్చుచున్నారేమి చేయుదును?

మందా—బిడ్డా! నిన్నుఁ గానక దుఃఖపడుచున్న మీతండ్రిగారి నూరడించి, నీకుఁ బ్రాణదానమహోపకారము చేసి విజయమూని నిల్చియున్న మాధవునిఁ గూడ సంభావింతము రమ్ము. (నిష్క్రమించుచున్నారు)

—గద్య.—

ఇది శ్రీపరమేశ్వరకరుణాప్రసాదసమాసాదితసరససాహిత్యధురంధర వడ్డాది సాధువంశక్షీరసాగరరాకాసుధాకరరాచ్చనామాత్యపౌత్త్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధేయాంధ్రీకృత మల్లికామారుతప్రకరణమునందుఁ బంచమాంకము.



శ్రీరస్తు

# మల్లికామారుతప్రకరణము

## షష్ఠాంకము

(తరువాతఁ గాషాయాంబరయుగళహస్తుఁ డొకపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు)

పుర — (హర్షముతో) ఓహో! బృహస్పతిని బరిహసించెడు తనవయఃప్రభావముచేత మల్లికాకరగ్రహణమంగళమును సులభపఱుచుకొనుచున్న మాళంబరకప్రభువుగారి యెడలనమాత్యవిష్ణురాతుఁడుగారి పుత్రుఁడు చంద్రరాతునికి స్నేహానుబంధమత్యధికము గదా! అందుచేతనే సన్నిహితమైనయీవివాహమహోత్సవమునందు సంభావితు లగుమహాజను లిటుకొటము పారయక సుఖముగా వసించుటకయి నిజమహాభవనమునందుఁ గొంత భాగము వారికి విడిదకుఁ గూడ నొసంగినాఁడు. ఇంతియకాక తండ్రి యయినవిష్ణురాతుఁడుగారికి సమ్మతము కాకపోయినను దా నాయనను సరకుగొనక తనసోదరిని రమయంతిని నార్యకలవింకునికిచ్చుటకుఁ జూచుచున్నాఁడు. (నవ్వి) సోమపసంకూలమునఁ జూచినదే మొదలుగా నార్యకలవింకునికి రమయంతియందు ననురాగము వర్ధిల్లుచున్నది. దానం జేసియేకదా యతఁడు సవికారము లయినన యనాంచలములతో నమ్ముంచుఁబోణిని మరల మరలఁ జూచుచున్నాఁడు. తానుగ నెట్టయెదుటికిఁ బోయి యేమేమో సల్లాపించుచున్నాఁడు. తానేవో ఘనకార్యములు చేసినట్లు తననోటితోనే యామెయొద్దఁ జెప్పుకొనుచున్నాఁడు (పకపక నవ్వి) ఇతఁ డిన్నిపాట్లు పడుచున్నను నామె కించుకమాత్ర మితనిమోము విషప్రాయము చూడ గిట్టదు. (విమర్శించి) కానున్నది కాఁగలదు. ఆర్యకలవింకుఁడును రమయంతికను సర్వదా పొందఁగలఁడు. అఘటితఘటనాసిద్ధవిద్యారా లయినమందాకినీభగవతిని నానావిధసత్కారములు చేసి శంబరకప్రభువుగారు తమపక్షమునకుఁ ద్రిప్పుకొనుచున్నారు గదా! ఆతల్లి నిశ్చయముగాఁ దలఁచుకొన్నపక్షమునకుఁ దామరకును జందమామకును బరస్పరానురాగము గలిగింపఁగలదు. చెంగలువనయినను వేవెలుఁగుతో సంఘటింపఁగలదు. ఇదిగోఁ! క్రొత్తగా వికసించుచున్న మోదుగఁబువ్వువన్నె గలిగిన యీపెత్తనిసన్న కావిదువ్వలువ లామె కిచ్చుటకే గదా ప్రభువుగారు నాచేతఁ బంపినారు. వివాహమంగళోపకరణవ్యాపృత యయిన భగవతిని జూచుటకయి, విద్యుద్విలాసము

వంటి కాంచనధ్వజదండమండలముచే త్తినబహిర్గోపురముచేదీపించెడునమాత్యవిశ్వ వసుఁడుగారి యీమహాభవనమునఁ బ్రవేశించెదను. (ప్రవేశమభినయించి ముందు చూచి) ఇదిగో! రమయంతికకుఁ బ్రియసఖి యయిన మధురిక లోఁగిటిలో నుండి యీలాగున వచ్చుచున్నది.

మధు—(ప్రవేశించి యానందముతోఁ దనలో) అహా! యనితరసాధారణమతిప్రభావ యగుమందాకినిభగవతి శంబరకవంచనోపాయము ననవద్యముగాఁ గనిపెట్టినది గదా! (నిశ్వసించి నిర్వేదముతో) అయ్యో! రమయంతికకు రుద్రరాతుఁడు సహజశత్రువు గాని యన్నగాఁడు. మర్కటమునకు మల్లెపువ్వులదండవలెఁ గలవింగకునకీ మె నియ్యఁ జూచుచున్నాఁడు ఇందుకుఁ గూడఁ దెలియఁదగిన యుపాయముఁ బ్రియసఖికిఁబోలె భగవతి నా చెవిలోఁ జెప్పియేయున్నది. (పురుషునిఁ జూచి) ఇప్పు డేకగృహనివాసపరిచయమువలన వీఁడు శంబరకపరిజనుఁ డయిన చపలకుఁ డని నేను దెలిసికొనుచున్నాను.

పురు—మధురికా! భగవతి మందాకిని యెక్కడ నున్నదో నీకుఁ దెలియునా?

మధు—(తనలో) వీఁడు భగవతిని వెదకుచున్నాఁ డేమి? కాని అడిగెదను. (ప్రకాశముగా) చపలకా! భగవతి యెందుకు?

చప—(నవ్వి) ముద్దరాలా! యనుల్లంఘనీయ మయినయాకాశభాషితమును బ్రతిపాలించుటకయి శంబరకప్రభువుగారి కామె సర్వవిస్రంభపాత్ర మయి ప్రవర్తించుచున్నది కాదా?

మధు—(తనలో) తల్లీ! భగవతీ! నీవంచనప్రభావమునకు నమస్కారము.

చప—(తనలో) రమయంతికావృత్తాంతముఁ జెప్పెదను. (ప్రకాశముగా) ఇప్పు డావశ్యకముగా భగవతిని సందర్శింప వలయును అన్నగారగు రుద్రరాతుఁడు తన్నుఁ గలవింగకునకు నిచ్చినను మంకుఁదనమున నాతనిఁ బెండ్లియాడ రమయంతిక సమ్మతింపక యున్నది. కాఁబట్టి భగవతి యామె పెంకితనమును మానింప వలయును.

మధు—(సోపహాసముగాఁ దనలో) వానియాసకాల! అకలవింగకుని పరిశ్రమమునకు భ్రమరకచరణతాడనమే తుదకు ఫల మగును లే. (ప్రకాశముగా) చపలకా! రమయంతిక నొడఁబఱుచుట యనఁగా భగవతి కది యెంతపాటిపని? (తెరలో) నవమాలికా! యాలసించెద వేమి? కమ్మనిపరిమళముతోఁ దెమ్మెరలు వీతెంచెడుకతమున నతిమనోహర మయినలీలోద్యానమునఁ బ్రవేశించి యెంతసేపటినుండియో మల్లిక నీరాకను బ్రతీక్షించుచున్నది నీవు త్వరితముగాఁ బోయి యోకాం

తమున వివాహోచితము లయినమంగళభూషణములను సవిశేషముగా నామె కిప్పు డలంకరింపు మని భగవతి నీ కాజ్ఞాపించుచున్నది. పెండ్లివారు రాక మునుపే నీ వీపని నెఱవేర్పవలయును జుమీ.

మధు—(తనలో) ఇది మంచిదే మారుతుఁడు గూడఁ గలకంఠభ్రమరకసహాయుఁడయి యిక్కడనేయున్నాఁడు. అతనిని నిగూఢముగా నక్కడకు సారసిక తోడుకొనిపోయినదిగదా! ఇఁక నేనును దగినసంవిధానమునఁ బ్రవర్తించెదను. (ప్రకాశముగా) చపలకా! యిదిగోఁ గంచుకులు భగవతి యాదేశమును జరుపుచున్నారు. ఆమె చేరువనేయున్నది. సులభముగా సందర్శింపవచ్చును. బొమ్ము. (నిష్క్రమించుచున్నాఁడు. ప్రవేశకము)

(తరువాత మారుతుఁడు కలకంఠుఁడు భ్రమరకుఁడు ప్రవేశించుచున్నారు)

మారు—భ్రమరక! మల్లిక యీచేరువ లతామంటపము నడుమ నున్నదన్నమాట సత్యమగునా?

భ్రమ—ప్రభువా! కాళిందీనవమాలికలు మంగళాలంకరణమును జేయుచుండఁగా నామెను జూచివాఁడనని మనవిచేసితినిగదా!

మారు—(నిట్టూర్పుతో)

శా. దేనిం బొంద నసహ్యమన్మథరుజాతిం గూరి మున్ గోరితిన్,
దేనిం గాంచుట దుర్లభం బనెడుభీతిం బ్రాణనైరాశ్య మే
యే నట్లొందితి, నట్టిజీవితఫలం బిచ్చోఁ గరప్రాప్త మ
ట్లౌ; నంబా! భవితవ్యతా! మరల నె ట్లావిర్భవింతో గదా!

కల—మిత్రుఁడా! సంశయింపకుము. గొంతు గోసికొనుట కయిన జంకు లేక నీవు సాహసింపఁగానే మల్లిక నీచేతిలోఁ బడినదిగాన జీవితఫలము భవానీప్రసాదము వలన నీకుఁ గరప్రాప్తమే.

భ్రమ—ప్రభువా! లతామండపమునకు మార్గ మీమల్లికాదళముల నడుమనుండి.

మారు—భ్రమరక! యీప్రదేశము దట్టంపుటాకుజొంపముల గుబురయినతీవలగుంపుకతమున జీబుకొని యున్నను బరిజను లెవ్వరయిన వత్తురేమో యనుజంకున నెమ్మది లేక కాలు గదలింపఁజాల కున్నాను

భ్రమ—ప్రభువా! భగవతి యాజ్ఞచేతఁ బరిజనమును వేత్రహస్తు లుద్యానవనమునకు దవ్వులనే యాటంకపఱిచి యున్నారు.

మారు—(హర్షముతో) ఓహో! భగవతినీతి సర్వత్ర యప్రమాదిని గదా! దారి చూపుము.

భ్రమ—ప్రభువా! యిటు. ఇటు.

(అందఱు నడుచుచున్నారు)

కల—(చూచి) ఓహో! యమాత్యవిశ్వావసుఁడుగారిభవనము ప్రత్యాసన్నవైవాహికమంగళమును సూచించెడు నదా త్తమండనవిధానముచేత నెంతచక్కఁగా శోభిల్లుచున్నది!

ఉ. తేనియ లుట్టు ద్వారముల దిద్దిరి వందనమాల; లుంచి రిం
పైనవి క్రొత్తచిత్రరువు లచ్చపుమేడల గోడలందు; సం
ధాన మొనర్చి క్షౌమపువితానములందు సువాణిజల్లులన్,
మానుగ వీథివాకిట నమర్చిరి బంగరుఁగాయమానముల్. 2

మఱియు—

ఉ. లీల నళిందకేతుపటలీపటపల్లవముల్ గదల్చుచున్,
దాలిచి తోరణప్రసవదామసుగంధమరందబిందువుల్,
గాలులు వీచు వెల్లువిచలత్కుచకుంకుమఘర్షవేగసాం
దోలనచేటికామృదులదోర్వలయధ్వను లాహరించుచున్. 3

భ్రమ—(చెవి యొగ్గి) ప్రభువా! కేవల మిది వలయధ్వనియే యనియెద రేమి? అటునిటుఁ బ్రధావించెడు వారసుందరులనితంబబింబముల ద్రేలుచున్న మణిమేఖలాసహస్రములఝుణఝుణత్కారంబులఁదోరంబయి, ఘూర్ణమానసకలాంతఃపురజనంబుల భూషణారావంబులఁ బూరితంబయి, గుంజన్మంగళమృదంగశంఖకాహళాదినినాదంబుల నిర్భరంబయి, సన్నిహితమహితభూదేవవర్గసంపఠ్యమానపుణ్యాహఘోషంబున మాంసలంబయి, వృద్ధకులాంగనాజనసమారబ్ధంబు లైనపవిత్రపార్వతీలక్ష్మీకల్యాణగానంబులవనూనంబయి యీయుత్సవకోలాహలము మహీయముగానున్నది గదా!

మారు—(నిశ్వసించి) సఖా! కలకంఠ!

క. రమణీమణికిం బరిణయ మిమయము ప్రాపించుచుండ సాన్నిధ్యము, చి
త్తము సంశయడోలారూఢ మగుచు నూఁగాఁడఁగాఁ దొడంగెడు నాకున్.

భ్రమ—ప్రభువా! లతాభవనసమీపమునకు వచ్చినారము

మారు—(సంతోషముతో) మల్లికావాససుభగమయిన లతాభవనమా యిది?

కల—ప్రసాధనసమయసంభావ్యమయి క్షణోత్పన్నవిరత మయ్యెడుభూషణఝంకారము వినఁబడుచున్నది గదా!

భ్రమ—ప్రభువా! మంగళస్నానవిశుద్ధముగ్ధ మయిన పరిక్షామపాండురాంగంబుచే సవిశేష శోభనీయదర్శనయుఁ బ్రసాధననిపుణనవమాలికా నిర్వర్తితవివాహనైపథ్యమధురోదారవేషయు నయి సాక్షాత్కరించిన యుద్యానలక్ష్మి నాఁ దీఁగలసందులనుండి యదిగోఁ బూజ్యురాలు గనంబడుచున్నది.

కల—(పత్రజాలకాంతరమునుండి విలోకించి) మిత్రుఁడా! చూడుచూడు.

మ. ఇదె సుక్షామమనోహరాంగకము లెంతేఁ గాంతిపూరంబులన్
వెదనల్లన్ నయనాంబుజంబులకు నత్యల్పప్రమోదంబు గాఁ,
గొద లేనట్టివిభూషణంబులు హారంగుం బెంపఁ గళ్యాణి యీ
పొదరుండీవలయొద్దఁ దాను నొకపూవుందీవ యై భాసిలున్. 56

మారు—(ఆనందముతోఁ జూచి) ఇదిగో నీమె కొంచెముగా మోము పెడమరల్చినది. కాళిందీనవమాలికలతో నేమో సల్లాపించుచున్నది సుమీ. మన మీతీఁగలనడుమ నుండి ప్రవేశించి రహస్యముగాఁ జూతము. (అట్లు చేయుచున్నారు)

(తరువాత ముందు చెప్పినట్లు మల్లికయు, నవమాలికయుఁ గాళిందియుఁ బ్రవేశించుచున్నారు)

మల్లి—సఖులారా! మీవిప్రలంభవచనముచేత నే నేనీయలంకారమున కనుమతించితిని,

నవ—సఖీ! నీవు వేఱుగాఁ దలంచుకొనకుము. (మారుతునిఁ జూచి సంతోషముతో జనాంతికముగా) కాళింది! మహాభాగుఁడు వచ్చి వెనుక నున్నాఁడు. వెల్లడింతమా? ప్రియసఖికి సత్యమని నమ్మిక పుట్టును.

కాళిం—సఖీ! వెల్లడింపకు. సమయము వచ్చినప్పుడే వెల్లడింపవలయును.

నవ—(చిఱునవ్వు నవ్వి) సఖీ! మల్లికా! నీవు మమ్మును వంచించితివి గదా!

మల్లి—(అనుతాపముతో) ఎప్పుడు?

నవ—సఖీ! రాత్రివేళ మమ్మునుఁ గూడఁ గన్నుమొఱఁగి ప్రాణపరిత్యాగమునకుఁ బ్రయత్నించినదానవు కావా?

మల్లి—(సిగ్గుపడుచున్నది)

కాళిం—అదృష్టవశమున వెంటనే రాక్షసునిచేత గృహీతవయి మహాభాగునిహస్తమునందుఁ బడినదానవు.

కల—సఖా! మల్లిక పడినచోటనే నీవుండుట యెట్లు తటస్థించినది?

మారు—మిత్రమా! నే నుపవనాంతరమునఁ బ్రవేశింప నెంచియుఁ గాలు ద్రొక్కిలినం దున సంశయించి యక్కడనే నిలుచఁబడితిని.

మల్లి—కాళింది! రాక్షసుఁడు గాఁడు. ఎవ్వఁడో యొకదివ్యపురుషుఁడు. అతఁడు మహాభాగునకు జన్మాంతరమిత్రుఁడని భగవతి నాకుఁ జెప్పినది.

(ఇద్దఱు విస్మయపడుచున్నారు)

కల—సఖా! యేయపురాక్షసజన్మమునుండి యాయనను నీవు విడిపించితివి గదా! ఆ మహాపురుషుఁ డెందుఁ బోయినాఁడు?

మారు—అతఁ డత్యంతసౌహార్దమున నాతోడ మాటలాడి సఖుఁడా! నీవు నన్నుఁ దలంచుకొన్నతోడనే నీయొద్దకు వచ్చి నీయభిమతమును నేను నెఱవేర్చి పోయెద నని పలికి వెంటనే తిరోధానము నొందెను.

నవ—కాఁబట్టి నీవే విప్రలంభశీలవు

మల్లి—నీయుపాలంభ మూచిత మయినదే.

నవ—సఖీ! నీ కీయలంకరణ మనుకూలముగా నున్నదో లేదో చెప్పు.

మల్లి—(సిగ్గుతో చిఱునవ్వుతో) సఖీ! యిది నాయలంకారము గనుక సిగ్గున నిట్టిది యని ప్రశంసింపఁ జాలకున్నాను. ఇంతియకాని నీప్రసాధననైపుణి వాగతీతమే.

కల—వాగతీత మని మల్లిక చక్కగాఁ జెప్పినది. ఇం దొక్కొక్కటే వర్ణనము నతిక్రమించుచున్నది. ఇది చూడు—

తే. గీ. వలమునభినవకుంకుమపంకమునను। దిద్దుమదిరాక్షిముద్దులతిలక మొప్పు;

మారు—(అభిలాషతో)

రక్తమె రమ్యవదనాబ్జసక్తమై యు।చంచలత నిల్చుమామకస్వాంతమట్లు. 6

కల—(చిఱునవ్వుతో) సఖా! నావచనమును నీ వపహరించితివి.

భ్రమ—అయ్యా! చూడు చూడుఁడు ప్రభువుగా రొసంగిన హారయష్టి యీ మెకంత మూలమును జుట్టుకొని యున్నది.

కల—(చక్కగాఁ జూచి) నిజముగా నిది వయస్యదోరంతరవిహారదుర్లలిత మయిన హారవల్లియే. (విమర్శించి)

మ. స్మరదాహంబునఁ బాండుమూలమగుమక్షశంఖంబుపాంశంబు దా
హరియింపం దగుకంఠకాండమున నీహారంబు భాసిల్లెడున్;

మారు—

హరిణాక్షీవదనంబు నిక్కముగ నేణాంకుండుగా నెంచి యం
బరమందుండి యుడుప్రకాండము భజింపం గోరి యేతెంచెనాఁ.

కళ—(సశ్లాఘముగా) నీప్రతిభోత్కర్షము సర్వోత్తరముగదా!

మారు—సఖా! సముదారవిరచితనీలధమ్మిల్లగర్భితగ్రథితమాలతీకుసుమసౌరభ్య లుభ్యదిందిందిర సుందరీమధురసమారబ్ధమంగళసంగీతకంబును, ననర్ఘతాటంకకిరణపల్లవితకోమలకపోలవిన్యస్తపత్త్రలతాకులంబును, నతిసురభిహిమజలశబలకుంకుమఘనసారసరసాంగరాగలులితఘనతుంగకుచకుంభాభోగప్రేంఖోళహారజాలంబును, నిబిరీసనితంబమండలమండిత కాంచన కాంచీగుణపద్మరాగమయూఖపుంజపుంజితస్ఫారంజితమంగళక్షౌమంబును, నాముక్తమౌక్తికనూపురకిరణక్రమహంససంసేవితచరణపుండరీకంబును నై నయనాభిరామ మయినయీమె వైవాహికనైపథ్యము సకలప్రతిభాదూరముసుమీ. (బాగుగఁ జూచి) అయిన నీయనవద్యాంగికి నలంకారములు పునరుక్తములే. చూడు—

మ. నయనప్రాంతపతంసితశ్రుతిపుటీ న్యర్థంబు నీలాబ్జ; మే
క్రియ హారంబున గానీ భారము స్మితశ్రీఁ దాల్చు చందోయి? న
వ్యయరాగాంఘ్రియుగాతిబాధకము పెండాలక్తపాతంబు; ని
శ్చయ మీసాజపుఁ గమ్మతావి మెయికిం జర్చల్ వృథాయాసముల్. 8

భ్రమ—పాపటయందుఁ జూడామణి కనఁబడ దేమీ!

నవ—సఖీ! నీయవయవలక్ష్మిచే నలంకృత మయిన మంగళాలంకరణము నీరత్నముకురమునఁ జూచుకొనుము.

(ఎదుట నద్దముఁ గనఁబఱచుచున్నది)

మల్లి—(సిగ్గుతోఁ జూచుచున్నది)

మారు—సఖా! చూడు—

మ. ఎలప్రాయంబున మీఱుసోయగము చే నీమూజగంబంగుఁ జి
క్కులకొల్పుల్ గల రెండవ ఱేని, యయినం గాఁక యథార్థంబు గాఁ
దెలుపంపుంగని యైనయీకలికికిన్ సిద్ధోపమానం బెటన్;
నిలువుం దర్పణరత్నమం దొదవునీనీడం జుమీ చూచితిన్. 9

నవ—సఖీ! స్వభావస్నిగ్ధము లయినసీలనయనోత్పలముల భేదము గానరాని కాటుకరేకతోడను, ముగ్ధమధూకధవళ మయిన గండమూలమున గుణోత్కర్షము గాంచుచున్నకస్తూరికాపత్త్రలతలకతమున విభావిత మగుశోభాతిశయముతోడను, గౌరీచరణలగ్నలాక్షారుణకంకరాపీడచంద్రరేఖకుఁ బ్రతివచ్చెడుమనోహరకుంకుమతిలకాంచితరమణీయలలాటమునిటుఁతోడను, గండళితకందర్పప్రతాపాంకురశంక నుత్పాదించెడును దారసీమంతపథదత్తసుందరసిందూరముతోడను, సకలలోచనానం

దసంధాయక మయి చందమామకు సాటి వచ్చెడు నీమోముఁదామరను నీవు గూడఁ జూచుకొనుము.

మల్లి—సఖీ! నవమాలికా! నాకు శిఖామణి యేల పెట్ట వయితివి?

నవ—సఖీ! మఱచితివా? రాక్షసహస్తమునుండి జాఱిపడినప్పు డది మరలఁ గ్రిందఁ బడిపోయిన దని నీవే చెప్పితివి గదా?

మారు—అయ్యో! శిఖామణీ! మరలఁ గ్రిందఁ బడిపోయితివా?

తే. గీ. ఎట్టెటో యీమెపొందు నక్షత్రశత। మరల మరలను గొండొక పారయునీకు
మానికవ. నాకుఁబోలెను మాటికికటా! కలుగుచున్న దియొకఁ బాటునులభముగను.

(తెరలో) నవమాలికా! త్వరపడు త్వరపడు. మండనవిధినిర్వర్తింపుము. (అందఱు వినుచున్నారు)

కాళిం—సఖీ! భగవతి వేగిరించుచున్నది. పోదము. ఈవివాహమంగళారంభము నీవు పొందఁ దగినది గదా!

మల్లి—(విషాదముతో నిశ్వసించి తనలో) అయ్యో! నాప్రాణము నను గాపాడుటకు మాత్రము ప్రయోగించెడుమాటలాడు నీప్రియసఖులచేత మోసపోయితిని. కటకటా! నిష్కరుణారంభ మయిన నిష్ఠురగగనవాణీదుర్విపాకము చేత నాజన్మఫల మపహృత మయినది. హా! మందభాగినిని నే నిప్పు డేమి చేయుదును? వెంటనే నన్నా క్రూరరాక్షసుఁ డేల భక్షింపఁ డయ్యెను? అయ్యయ్యో! దురదృష్టవంతురాలను నిరాలంబ మయిన యాకాశమునుండి క్రిందఁ బడినప్పుడు నుగ్గునూచ మేల కానయితిని? (స్మరించి మరల నిశ్వసించి) అయ్యో! యట్లు కంఠదేశమునఁ గఠోర ఖడ్గము నుంచుకొని జీవితపరిత్యాగమునకుఁ బ్రయత్నించిన యామహాభాగుఁడు నానిమిత్తమిఁక నేమి గా నున్నాఁడో!

నవ—(జనాంతికముగా) సఖీ! కాళింది! పాపము! నిజము తెలియక ప్రియసఖి మననవ్వుటాలచే నధికవ్యథ నొందుచున్నది (ప్రకాశముగా) భర్తృదారికా! ప్రత్యుత్తర మీయక యూరకుంటి వేమి? నీయూర్పుగాలు లేల దీర్ఘోష్ణములయి యెఱ్ఱనిమోవిచిగురును గమలించి పయ్యెద చెఱఁగు నల్లఁగార్చుచున్నవి? ఏమిటి కీబాష్పస్తబకములు నీచెక్కుటద్దముల వ్రాసినచిత్రలేఖలను జెఱిపి కాటుక గరంగఁ గాలువలు గట్టుచున్నవి?

మల్లి—(నిశ్వసించి) సఖీ! నవమాలికా! మనోరథసహస్రములచేత సంపాదిత మయిన నాప్రియవస్తువును విఘటించునిష్ఠురవిఘ్న మనియెడు మృత్యుదేవత కత్తుకను జొచ్చి బాధపడుచున్న దానినిగా నన్నెఱింగియుండియు నీవుగూడ నిట్టులాయాసపెట్టెద వేల? (నిర్వేదముతో) జీవితనిర్విశేషురాండ్రగు ప్రియసఖుల కిదియుక్త

సౌ. ఇంతదనుక నయ్యయి విప్రలంభవచనములచేతఁ బ్రతారించి యిప్పుడు వెండియు నస్నాహేయపుఁగుంభీపాకమునఁ గూలఁద్రోయఁ బ్రయత్నించెదరు.

కల—వయస్య! నీసౌభాగ్యమును జూచుకొనుము.

ఉ. ఈమె ప్రియాళివాక్యముల నెంతయు నమ్మి భవత్సమాగమా
శామిళితాత్మ, ముగ్ధ, తను జక్కఁగ మున్ గయిసేయ నిచ్చె, యి
చ్చో మది బాష్పకంఠి యయి సుక్కఁడు నన్యవివాహసంశ్రుతిన్,
లో వెంగలుం దలంచి దిగులుం గను బాలమరాళిపోలికన్. 11

నవ—(సకరుణముగా, జనాంతికముగా) కాళిందీ! మనసులోని దుఃఖముచేత నతివిషమ మయిన భర్తృదారికావచనము నాలకింపుము

క. అనుకూలవిప్రలంభము । లను మన నొందింప నమ్మలము సస్నేహం
బును సవిషాదము నొల్లుం । దనము సధిక్కారమునుగ నాతి వచించున్. 12

(ప్రకాశముగా) సఖీ! యీమావిప్రలంభవచనమునకుఁ గినియకుము. ప్రసన్నవు గమ్ము. (మారుతునిఁ గడకంటఁ జూచి) నీయందు సవిశేషబద్ధానురాగుఁ డయిన యీయనకు నీకరకమలము నొసంగుము. బంధువర్గము నానందపఱుపుము.

మల్లి—(శోకభారముతో) సఖులారా! తరుణమయూరపింఛమువంటి నిద్దంపుఁ జామనచాయ గలమంగళాంగమైన నెసంగుమహాభాగుని మారుతుని సందర్శించినది మొదలు అన్యపురుషునిఁ దలంచి యెఱుంగను; కాఁబట్టి సత్యప్రమాణముగాఁ జెప్పుచున్నాను. విను మహాభాగునిపూర్ణలావణ్యమనెడుభాగీరథీప్రవాహమున నవగాహనము గావించుటచేతఁ బవిత్రము లయిననా నేత్రములతో లాఁతివాని నిఁక ముందును జూచుదానను గాను.

కల—మిత్రుఁడా! యీవచనమాత్రము ను వీనుజేరలతో జుఱ్ఱుకొనుము.

మార—మదీయమానసవిహారమల్లికాక్షీ! మల్లిక!

చ. హృదయమునన్ నిరూఢ మగుప్రేమరసాతిశయంపునూత్న పు
న్నది కడుఁ బొంగి పైఁబొరలు నా, హృదయంగమ మైనపల్కులన్
మదనమహాగ్నిదగ్ధుఁ డయి ప్రమందెదు నా కమృతాభిషేకసం
పద గిలిగించినట్లయితి; ప్రాణము వచ్చెను ప్రాణనాయికా. 12

(మరలఁ దెరలో) నవమాలికా! త్వరపడుమనుచున్నారు. సిద్ధాంతులు పెట్టిన వివాహముహూర్తము సమీపించుచున్నది.

(అందఱు వినుచున్నారు)

మల్లి—(కన్నీళ్లతో) అయ్యో! భగవతి మరల నాజ్ఞాపించుచున్నది సఖీ! నవమాలిక? లే లెమ్ము. భగవతి తానుగానే యిక్కడకు వచ్చునేమో? ఇంతలో వేఱొక లతావలయమున కరిగి మిమ్మొకటి ప్రార్థించెదను.

వన—సఖీ! నీ వాజ్ఞాపానయోగ్యురాలవు. ప్రార్థించుటయేమి? మమ్ము నీయచ్చ వచ్చినకార్యమునందు యథేష్టముగా నియోగించి భగవతి యాదేశమును నిర్వర్తింపుము.

మల్లి—సఖీ! విషాదసంభ్రమములచే నాదేహము కంపించుచున్నది. కాఁబట్టి నేను లేవలేక యున్నాను నాకన్నుదోయిని బాష్పపూరము గప్పుచున్నది; నే నిందుచేతఁ జూడను సయితము చాలకున్నాను నీవే నాచేయిపట్టుకొని లేవఁదీసి మెల్లగా లతావలయాంతరమున నన్నుఁ బ్రవేశపెట్టుము (చేయి చాఁచుచున్నది)

సఖులు—(సంజ్ఞచేఁ బాణిగ్రహణమునకై మారుతునిఁ బ్రేరించుచున్నారు)

మారు—(భయము నభినయించుచున్నాఁడు).

కల—మిత్రుఁడా! యిది సాధ్వసమునకు సమయము గాదు చిరకాంక్షిత మయిన మల్లికాపాణిగ్రహణమహోత్సవము ననుభవింపుము.

మారు—(లతావలయమునుండి వెడలివచ్చి మల్లికపాణిని గగుర్పాటుతో గ్రహించుచున్నాఁడు)

మల్లి—(హర్షముతో) సఖీ! వనమాలికా! నీస్పర్శమిప్పుడు వేఱుగా నున్నది. చేయి పట్టుకొన్నంతమాత్రమున నాయవయవము లన్నియు నమృతవర్షమునఁ దడిసినట్లు సుఖపారవశ్యము నొందుచున్నవి (మారుతునే యూఁతకొని లేచుచున్నది)

మారు—(బాలు నలుకకయే మెల్లమెల్లగాఁ దీసికొని పోవుచున్నాఁడు)

సఖులు—(చిఱునవ్వుతో వెంబడించుచున్నారు)

కాళిం—సఖీ! మల్లికా! లతాంతరమునకు వచ్చినారము కాఁబట్టి చెప్పఁ దలఁచిన దేమో చెప్పు.

మల్లి—(నిట్టూర్పుతో) సఖీ! వనమాలికా! యేమిటికి మొదటికి వచ్చినారము?

♦మారు—బహుళకుసుమరసపరివాహమందరపరిమళలోలలోలంబపుంజబద్ధతిమిరమీమందారమూలమునొద్దకు.

మల్లి—(సబాష్పగద్గదముగా) ఈమందారము నేను పెంచినదే. కాఁబట్టి నిర్జనమైన యీప్రదేశమునందు మి మ్మొకటి ప్రార్థించెదను.

కాళిం—సఖీ! మే మవధానము గలిగియున్నాము.

మల్లి—ఓ జీవితనిర్విశేష! మారుత! (అర్ధోక్తిని వై లక్ష్యమభినయించుచున్నది)

సఖులు—(పరస్పరము నవ్వుకొనుచున్నారు)

---

♦ ఈవాక్యమున్నాలమందు సంస్కృతప్రాకృతసమానము.

మల్లి—ఓజీవితనిర్విశేష! నవమాలిక! సఖీ! కాళింది! పరిపూర్ణచంద్రసుందరాకారుం డగుమహాభాగుని పాదములకు శుశ్రూషచేయుభాగ్య మభిలషించికదా విఘటమాన మయిననాజీవితమును నిలుపుకొంటిని. ఆకందర్పసుందరుని ప్రథమదర్శనము మొదలిప్పటిదనుక నుగ్రమాదీర్ఘికాంవిందమకరందవాహులయిమందమందముగా వీతెంచెడు నుద్యానవనమారుతములకు నోర్చుచుకొనుచుంటిని. ప్రచండమకరధ్వజభుజదండమండలితధనుర్దండటంకారఘోరములయినమధుకరహుంకారముల నాకర్ణించుచుంటిని. చిగిరించినతీయమావిగుబురులలో విహరించుచుం గోకిలముల గావించెడు పంచమప్రపంచము వాళావాళిచే దురంతము లగువసంతదివసములు వేగించుచుంటిని. ఇంతియ కాక కిసలయతల్పకల్పనములచేతను, మృణాళభంగహారరచనములచేతను, కదళీదళధవిత్రవీజనములచేతను కర్పూరపరాగచార్చిక్యసంపాదనములచేతను నీకను దత్తదుచితోపచారములచేతను, మిమ్ములను గూడ నాయాసపెట్టుచుంటిని అట్లు రాక్షసహస్తమునుండి జాతియానకమునుండి క్రిందబడుచు నిర్యూర్ధరాత్రమున నెవ్వానిచేత రక్షితనయితినోయట్టి మహాభాగునిసంగమ మెవరికో పుణ్యాత్ముఁరాండ్రకు సులభముగాని నాకు దుర్లభమే. కాఁబట్టి నాజీవితధారణము క్షణమేనియు మహాపాతకములలో నగ్రగణ్యమని తలంచెదను. సఖులారా! జనాంతరమునఁ బునర్దర్శనముగోరుచు మిమ్ము వీడుకొనుచున్నాను. (సప్రశ్రయముగా నంజలిపట్టి సగద్గదముగా) సఖీ! నానిమిత్తము నీవిట్లు నమస్కరించి సుందరభ్రూలత్మ్మబంధురుండును దీర్ఘస్నిగ్ధలోచనపుండరీకుండునునగు నమ్మహాజనుఁడు పరలోకగత నగునాకొఱకు జలాంజలి నిచ్చునట్లు రహస్యమున నాయనతో విన్నవింపవే. (రోదనము చేయుచున్నది)

మారు—(సకరుణముగాఁ దనలో)

చ. హరిహరి మేను వాసెడుప్రయత్నముతోడ శుభాంగి తా నిటుల్
కరుణమనోహరం బగువిలాప మొనర్పఁగ నాలకించుటక్
సరళతచేఁ గరంగెదును, జాలిని రూపఱుఁ, గంపమోహవి
స్తరమున, ప్రీలు నాతిక్, హాయసంబునఁ బొంగెదు, డెంద మిత్తతిక్. 14

కాళిం—సఖీ! యమంగళము దొలఁగును గాక.

నవ—(కన్నీరు పెట్టుకొనుచున్నది)

మారు—(ప్రకాశముగా)

* క. వీణావిరావకోమల । వాణీబంధుగణచిత్తవనజమరాళీ
రాణ నెసఁగుసహచారిణి । ప్రాణమునకుఁ దెగకు పలుక కఠినకరుణోక్తుల్. 16

నవ—(జనాంతికముగా) కాళింది! మహాభాగుండు ఎన నేర్పువేత నచ్చముగా నావ లె నే మాటలాడుచున్నాఁడు; కాఁబట్టియాయన యిప్పటికిని ప్రియసఖి యెఱుఁగదు.

మల్లి—సఖీ! ముద్దరాల! సాహస మనియెద వేమి? ఎవ్వనికి జీవలోక మంతయు మన్మయమయి కనఁబడుచున్నదో యెవనిహృదయము మదీయలాభభంగమున నతికాతర మయి కలఁగుచున్నదో, యంతటియర్ధరాత్రమున నటిదుర్గమప్రదేశమున కేకాకియయి పోయి సకలభూమండలమండనమయిన తనకంబుసుందరకంధరాకాండము నందు నెవ్వాఁడు క్రొవ్వాఁడికరవాలముఁ జేర్చుకొనునంతటి మహాసాహసమునకు సిద్ధపడెనో, యట్టియంటినాప్రేమనిధికొఱకు జీవితసహస్రపరిత్యాగ మయినను సాహసము కానేరదు. ఈవిషయమున నీవు నాకుఁ బ్రతికూలవు కాకుము. వెండియు మహాభాగునకు నామాటగా నిట్లు చెప్పుము. (సగద్గదముగా) నాథ! మందభాగినిని నే నిజన్మమున యుష్మదీయపరిరంభసౌభాగ్యమును బడయలేక పోయితిని. కాని జన్మాంతరమున నయినను నిహాంచే యపేక్షించుచున్నాను. నాతోఁబుట్టు వగు నప్పూలమాలికను మాత్రము మరకతశకవాటస్నిగ్ధవిశాల మయినమీవక్షస్స్థలమునందు నన్నుఁబోలె సర్వదా ధరించుకొనుఁడు. (మాధవునిఁ దడవుగఁ గౌఁగిలించుకొని యానందముతోఁ దనలో) ఏమిది? ప్రియసఖీసంస్పర్శము మయి నంతట మంచిగంధ మలంది నట్లయి మహాభాగపరిరంభమునకుఁ బ్రతి వచ్చుచున్నది. హృదయసన్నిహితుఁ డయి సుఖింపఁ జేయుచుండె నని తలంచెదను (ప్రకాశముగా) సఖీ! యిది నాకడసారి కవుఁగిలింత సుమీ.

సఖులు—(చిరునవ్వుతోఁ దమలో) ఇది కడసారిగౌఁగిలింత కాదు. మొదటిదో రెండవదో.

మాధ—(కౌఁగిలింపఁ బడియే యానందముతో సహజస్వరముతో)

ఉ. ఎవఁడు దృఢానురక్తమతి నిందుముఖీ నిను నిచ్చగించునో
యౌవనికిన్ శుభాంగి యును కే త్యజియింపఁగఁ జెంపుఁ జేసెదో

మల్లి—(తనలో) ప్రియసఖికంఠము మాఱిపోయినదేమి? (ప్రకాశముగా) అయన యెచ్చట నున్నాఁడు?

---

* ఈపద్యము మూలమునందు సంస్కృతప్రాకృతసమానము.

మారు—

వివిధవిషాదమారశరవిద్ధభుజాంతరగాఢపీడితా
త్యవిరళపీవరస్తనత హాయిగఁ ద్వద్భుజపంజరంబునన్. 16

మల్లి—అయ్యో! మహాభాగుఁడే. (హర్షసాధ్వసలజ్జలతోఁ దొలఁగుచున్నది)

మారు—

తే. గీ. సాధ్వసంబునఁ దొలఁగకు చంచలాక్షి! తగునె సంభ్రమకాతర వగుట దాన
జనునికడఁ? జిరకాంక్షితోత్సవపుఁ గౌఁగిలింటికిని భంగం బొనర్తు నదేల తాంగి!

మల్లి—(వ్రీడానూయలతో) సఖులారా! నేను బాగుగా వంచిత నయితిని.

కళ—(త్వరగా సమీపించి) కళ్యాణి! యాలాగున బలుకకుము.

మ. జగదుత్తముఁడు నావయస్యునకు భూపాత్రాయు వైతి వహో
సుగుణాఢ్యా! యెటు విప్రలబ్ధ యనవచ్చున్ నిన్నుఁ? ద్వత్ప్రాప్తిలో
భగరీయోహ్మృగతృష్ణికం బడి యునభ్రాంతి నర్తించుచు
ర్భుగుఁ డాశంబరకుండె నుమ్ము పరికింపన్ విప్రలబ్ధుం డిటన్. 18

ఉ. చందనపాదపంబునకు సౌరభసంపద వోలె, జ్యోత్స్న పూ
ర్ణేందునకుం బలెన్, మణికి సృష్టియుఁ బోలెను. శోభనాంగి! నీ
వందపుసొమ్ము గమ్మితని; కవ్వియు నానికిఁ బోలె నీకు నీ
సుందరమూర్తి యొప్పెడును జూవె సమభ్యుచితావలంబమై. 19

భృత్యు—(సమీపించి) నవమాలికా! మనయదృష్టము మంచిది. ఒడయుఁడు నొద
యుర్ఘాలు నభ్యుదయమున వర్ధిల్లుచున్నారు.

మందా—(ప్రహృష్టవదన యయి ప్రవేశించి)

తే. గీ. సిరియుఁ బార్వతి, భారతి, సీత, భీమజాత పౌలోమి, రుక్మిణి, సత్యభామ,
కృష్ణ, శర్మిష్ఠ, సావిత్రి, ధృతి నరుంధతీపరమసాధ్వి, యాశీర్వదింత్రు గాక.

(అంతటఁ జూచి సాశంకముగా) మల్లిక యీలతాభవనము నుండి యెక్కడకు వెల్లిన
దో! (లతాంతరమునఁ జూచి యానందముతో) అహో! నామనోరథములు ఫలిం
చినట్లే. ఇదిగో! మందారమూలమున మారుతుఁడు—

చ. అతిసుకుమారమున్ గృశము నై రమణీయతఁ గాంచుమేనితోఁ
బ్రతిపదుదుప్రియుండు సరి వచ్చెడురూపున లోభనీయుఁడై
చతురకటాక్షముల్ స్మరరుజాశబలాక్షము వ్రీళనమ్ర మా
నతులితమల్లికాముఖమునం దొలయించుచు నున్నవాఁ డిటన్. 21

(సమీపించుచు) నవమాలికా! యాలసించెద వేమి?

నవ—అహో! భగవతిదేవి వచ్చినది. (ఎదురుపోయి) భగవతి! మే మాలసించుటలేదు.

మల్లి—(సగద్గదముగా) భగవతీ! రక్షింపుము. రక్షింపుము. (అంజలిపట్టివచ్చుచున్నది)

మందా—(మల్లికను కౌఁగిలించుకొని) బిడ్డా!

మ. సమరాగుండు మహాభిజన్ముఁడు జగచ్ఛ్రుత్యుః ప్రియుం డౌజనో
త్తముఁ డందుల్ దృఢభక్తి నీవు; పొగడొందం జాలు కళ్యాణి! నీ
దుమనోవాంఛ ఫలించుఁ; బుణ్యసులభుల్ వో నిన్నుఁ బెండ్లాడి డెం
దముఁ గందించుచిరాంగజజ్వరముబాధం బాయు నం కీతఁడుల్. 23

నవ—(ఆనందముతో) భగవతీ! సర్వోత్తరమయిన నతని నిర్మాణపై దగ్ధ్యమాహరకాల మునకు సఫలమగుటచేత విధాన కృతార్థతను బొందుఁ గాక, శంబరకహతకుని పరిణయప్రసంగముచేతఁ గలుషము లయినబంధుజనహృదయంబులు ప్రసన్నతనొందుఁ గాక. మాతాపితృసమానము లగు మీహస్తములతో నే మహాభాగుని చేతికిఁ బ్రియసఖి నర్పింపవలయును.

మల్లి—(తనలో) అమ్మో! వారు సర్వమంగళావచనప్రమాణులు గదా!

మందా—నవమాలికా! నే నిప్పుడు వేఱుగ నర్పింప వలసిన దేమి?

తే గీ. చెక్కుచెమరింప కుండంగ రక్కసీని। చేతియందుండి తిగిచి రక్షించియీమె
ఘోరఖడ్గంబు మెడఁబట్టు కొన్నయితని। కరమునందుంచె సర్వమంగళయె మున్న.

మఱియు—

క. ఒండొరులలయిచ్చ నగుని। పెండిలి యుం జేల యీ మెం బెద్ద లొసఁగ! నా
థుం డుదయింపఁగ రంజిలు। చుండు కలువ నెవ్వరిచ్చిరో తొగచెలికిన్. 24

అయినను లోకాచారము జరిపించెదను. (మారుతుని గూర్చి) వత్స! మారుత!
యిటురా.

మారు—భగవతీ! యాజ్ఞాపింపుము.

మందా—

చ. వెలఁది, ప్రసిద్ధవైభవుఁడు విశ్వావసుం డురుకీర్తి పుణ్యసం
కలితత నద్ధి లచ్చి బలెఁ గానక కాంచినపుత్రి; ధర్మముల్
సలుపఁగ రాగ పావకుఁడు సాక్షిగ, నే సుహృదుండ వైనని
కెలమిని దీని శ్రేయసున కిచ్చెదఁ బచ్చనివింటివేల్పుతో. 25

కల—మాపుణ్యసురద్రుమము ఫలించినది.

నవ—మాకులదేవతలు ప్రసన్నలయిరి,

కల—(హర్షముతో) భగవతి! సర్వథా యనవద్యమయిన యీసంబంధమును జూచి హృదయము ప్రసన్నమగుచున్నది చూడు—

ఆ. వె. సహజఘనవిలాససౌందర్యసముదార। శైశవాళి కఖిలదృక్చకోర
కేందుకాంతి కీమె కిద్ధాభిజాత్యంబు। కనకకుసుమదామమునకుఁ దావి. 26

నవ—(మల్లికను జూచి నిశ్వాసముతోఁ దనలో) ప్రియసఖి మహాభాగున కిప్పటివలె సర్వదా ప్రేమాస్పదురాలయ్యెదునా!

మందా—(విమర్శించి కన్నీళ్లతో) వత్సా! మారుత!

మారు—(సాశంకముగా) భగవతీ! యాజ్ఞాపింపుము.

మందా—

ఉ. ఒరు లెఱిఁగింపఁ దగ్గ దొకఁ డుండదు తెలుఁగుదు జ్ఞేయసారముల్
వెరవరి! యైనఁ గేవలముఁ బ్రేముడి నన్ బలికించు నియ్యెడన్

మారు—(వినయముతో వినుచున్నాఁడు)

మందా—(మల్లిక చేయి పట్టుకొని)

తరుణి యి దేశపుత్రిసుమి తండ్రికి, బంధుల కెల్లఁ బ్రాణ; మీ
పొరసిన స్నేహబంధ మెడ పొందక యుండుత ముందు నీ వెంచోన్. 27

మారు—(లజ్జతో) అయ్యో! వాత్సల్యాతిశయమున మీకుఁ బుట్టరానిసంశయము పుట్టుచున్నది.

కల—భగవతీ! యతిప్రసక్తమయిన మీయభ్యర్థనమునకుఁ దగినయుత్తరము మిత్రుని పక్షమున నాకుఁదోఁచకున్నది చూడుఁడు—

చ. స్థిరపడె స్నేహ మీమె కన, స్నిగ్ధునకున్ సత్యదీక్ష నల్లె; క్ర
మ్మరు వశుఁడై తటన్న, నసమంచిత, మయ్యెను భూవశుండెమున్;
సరళత నిట్టిఁ డెవ్వఁ డన, సౌహృదవాక్యము; యీ మెకోసమై
సరకు గొనండు ప్రాణ మన, సర్వము నీ వెరియె చూచె వానిసీన్. 28

మందా—(సవిమర్శముగా మల్లికను గూర్చి) పుత్రీ! నీకుఁ గూడ నించుక యుపదేశించెదను.

మల్లి—భగవతీ! యానతిమ్ము.

మందా—

ఉ. సేవల నత్తమామలకుఁ జేయు; మెఱుగ్పకు మాఁదుబిడ్డకున్;
సేవకులం దయం గనుము, స్నిగ్ధవు, గమ్ము సపత్నులం; దతి
థ్యావళి సత్కరింపుము; గృహక్రియలందును బద్ధకింప; క
మ్మా! వెయి చెప్పనేల? సుఖ మందుము సల్పుచు భర్తయిష్టమున్. 29

మల్లి—(సిగ్గుతో మనస్సున నంగీకరించుచున్నది)

నవ — ఇది యుచితమయిన యుపదేశము.

మందా — వత్సా! మారుత! తలంచినప్పుడు వచ్చెదనని నిన్ను వీడుకొనినయాదివ్యపురుషుని మాకంద నాముని, శంబరకహతకవంచనార్థము మల్లికావేషమును దాల్చి దయచేయుమని యిప్పుడు సంస్మరింపుము.

మారు — (ధ్యానము నభినయించుచున్నాఁడు)

(తరువాత మల్లికావేషముతో మాకందుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మాకం — సఖా! మారుత! యిదిగో నేను వచ్చితిని. నీయభీష్టము నెఱవేర్చెదను.

(మందాకినీమారుతులు దక్క-మిగిలినయందఱు విస్మయము నభినయించుచున్నారు)

కాళిం — (జనాంతికముగా) నవమాలికా! యీతఁడు మహాభాగునిచే రాక్షసభావము నుండి విమోచితుఁడయిన దివ్యపురుషుఁడుసుమా!

నవ — కాళిందీ! యాశ్చర్యమాశ్చర్యము! ఎవ్వాఁడు ప్రియసఖిని భక్షించుటకు సిద్ధపడెనో యతఁడే యిప్పుడు రక్షించుటకు సిద్ధపడినాఁడు. (మల్లికతో) సఖీ! మాకు మఱియొక ప్రియసఖి యెట్లుగలిగినదో చూడు చూడు.

మారు — మహాపురుష! భగవతి నిన్ను మున్ను కోరినదాని నాచరింపుము.

మాకం — చక్కగా నాచరించెదను.

(కాషాయాంబరయుగళహస్తయయి సారసిక ప్రవేశించుచున్నది)

సార — భగవతి! యిది చపలకుండు తెచ్చిన వస్త్రయుగ్మము.

మందా — వత్స! కలకంఠ! నీ వీకాషాయయుగ్మముచే కోనసీయమయినను నా వేషము ధరించుకొమ్ము. ఇది విష[illegible]పభోగవిరుద్ధమే యయినను దీనిచేతనీవు రమయంతి కన్నుఁ బొందం గలవు. (అందఱు నవ్వుచున్నారు)

మారు — ఇదియు మనకు మంగళమే యనుకోవచ్చును.

కల — (చిఱునవ్వుతో) వస్త్రయుగ్మము తీసికొని నిష్క్రమించి మందాకినీవేషముతోఁ బ్రవేశించి) ఇదిగో! భగవతి నయితిని.

మారు — శంబరకుఁడు నీపాదములమీఁదఁ బడుఁగాక.

మందా — (కాళిందీనవమాలికలను గూర్చి) బిడ్డలారా! మీ రిద్దఱుఁ గలకంఠునితోఁ గూడ నీమహాపురుషు ననుసరింపుఁడు.

ఇద్దఱు — చిత్తము భగవతి!

మాకం — (చిఱునవ్వుతో) భగవతి! శంబరకునిఁ బెండ్లియాడఁ బోవుచున్నాను.

మందా — వత్సా! ముందు నీకుఁ జెప్పినమార్గమున యాయభిలషితము నెఱవేర్పుము.

మాకం — మిత్రుఁడా! రమ్ము కలకంఠ! మారుతునకు నేను నీవంటివాఁడనే సుమీ.

—మహాపురుష! మా కందఱకు నీవు పూజ్యుఁడవు. పోవుము తమ్ము. (కామందకీనవమాలికలతో నిష్క్రమించుచున్నారు)

మల్లి—సఖులారా! నా కిక్కడ సాయ మెవరు?

నవ—(చిఱునవ్వుతో నించుక మరలి) ఇదిగో నీమహాభాగుఁడే.

మందా—భ్రమరక! నీవుకూడ గూఢముగా విష్ణురాతునింటికిఁ బోయి మధురిక చెప్పినట్లు గావింపుము.

భ్రమ—చిత్తము భగవతి! (నిష్క్రమించుచున్నాఁడు)

మందా—వత్స మారుత! యిదిగో నిరుగడ దృఢముగా వెలుఁగుచేసి కాపాడఁబడెడు నీయుద్యానవీథి నాయాశ్రమము నంటి యున్నది. ఇక్కడ నంబికాదర్శనార్థమరుగు మల్లికకొఱకుఁ బుష్పాడియుంకలోఁ జక్కనిదారి యొకటి యేర్పఱుపఁబడియున్నది. కాఁబట్టి మనము పోవుదము. అస్మదాశ్రమోపశల్యభూములు రమణీయములు సుమీ. అక్కడ—

శా. స్వైరక్రీడల హాయిఁ దేల్చు మిముఁ గూజత్పోతఘూత్కారముల్,
ధారాధరభ్రమ ఫుల్లపింఛకనటద్బర్హీంద్రకేకాధ్వన
న్నీరంధ్రోరుతమాల సంతమసముల్, దీవ్యన్మరీచాంకురా
దారుణ్యాంచిత దృక్చకోరములు లీలారామ భూసీమముల్.

మఱియు—

చ. అలసినఁ గ్రీడలన్ సవలతాంతవితానలతాగృహంబులం
దొలయుచు మెల్లమెల్ల మిము నోపికతో భజియించు నూత్నని
ర్దళితబహుప్రసూనమకరందనిమగ్నసమీరణంబు లౌ
కలకలహంసరావసుముఖంబులు సోమసరస్సమీరముల్.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

గద్య.

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాదిసాధువంశక్షీర
నీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్రగుణ
కదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధాన
తనూభవ విబుధవిధేయ సుబ్బారాయనామధేయాంధ్రీ
కృత మల్లికామారుతప్రకరణమునందు షష్ఠాంకము.

| | | | |
|---|---|---|---|
| 78 | 11 | నయిశా | నయశా |
| 78 | 17 | పంక్తి తరువాత, కన— | ఇటు, ఇటు అనియుండవలెను. |
| 81 | 11 | నల | కల |
| 88 | 2 | మనో | వనో |
| 87 | 6 | నిశృతి | నిర్ఫృతి |
| 88 | 26 | తలంచెను | తలంచెదను |
| 89 | 14 | గలున | గల్లున |
| 91 | 28 | పనును | ఏనును |
| 96 | 17 | సర్వదా | సర్వథా |
| 112 | 18 | హాయి | హాయి |
| 112 | 13 | త్వైక | త్వైక |
| 112 | 16 | దృక్చ | దృక్చ |

అంతటను మధురిక పదము « మధుకరిక » యని చదువుకొనవలెను.

7, 21, 22, 23, 44, 66, 99, పుటలయందలి విశ్వావసు పదము «విశ్వావసు» వని చదువుకొనవలెను.

[ద్వితీయాంకమున 11 వ పద్యమునకును, దాని తరువాతి ప్రతీహారి ప్రవేశమునకును, నడుమ నీక్రింది యంశములను జేర్చి చదువుకొనవలెను.]

నవ—సఖీ! బాష్పాకీర్ణము లయిన నిశ్చలలోచనములతో నేమది యాలోచించుచున్నావు?

మల్లి—చెలియా! దీనిని నష్టద్రవ్యలాభముగఁ జూచుచు నా హృదయము గుఱుతు పట్టిన దానివలెఁ దనలోఁ దా నేమేమో చిత్రించుచున్నది.

నవ—కాళిందీ! ద్వీపాంతరమం దున్నదివ్యాంబర మిక్కడకు వచ్చుటయు దానిని జూచుటవలన నీమె హృదయము గుఱుతు పట్టిన దానివలె నుండుటయు వింతగాఁ దోఁచుచున్నది.

కాళింది—ఇం దాశ్చర్యమేమి? ఏది యెవరివస్తువో యది దూరమందుండున దయినను ...చెంతకు వచ్చితీఱును. చూడుఁడు.

క॥ దవుల విదేశంబ...ను। న్నవి యైన, నదృష్టరజ్జువకా గట్టిగ నీ
డువఁబడి మరుజని...స్సు। నెవరివి వారలకు వేగమే లభియించుకా ॥౧౨॥

అయినను గుఱుతుపట్టు... పుట్టువులమాత్ర మద్భుతమే. ఇంతేకాదు. మల్లెతీఁగ మొదల జననము. ...పుష్పమాల. ఈమె వృత్తాంత మంతయు నాశ్చర్యకరమే.

# వసురాయ చాటుప్రబంధము

డెమ్మీసైజు గ్లేజు 304 పేజీలు. { క్యాలికో రు 2—0—0
రేపరు 1—8—0

ఉ. నన్నయతిక్కనాదిరసనల్ గురియించినచాటుధార లీ
మన్నన నింకఁ బోలు; నణుమాత్రముఁ దగ్గదు మబ్బ టందు; హా!
జొన్నలలోనఁ జిన్నిపువుజొన్నటు, అట్టులు పద్దియంబులన్
మిన్నలు చాటువుల్, రససమృద్ధి ననిర్వచనీయమాధురిన్.

ప్రాస్తావికప్రకరణము; పద్యము. 2

క్రీ. 1935. ఇప్పటికి సుమా రొకయర్ధశతాబ్దమునుండి నేనప్పుడప్పుడు వివిధప్రస్తావముల రచించుచు వచ్చినట్టియు, సమకాలీనులైన పండితకవుల మెప్పును బొందినట్టియు, బహుజనులకుఁ గంఠస్థము లయినట్టియు, సహస్రాధికము లయినపద్యము లొకచోటను భద్రపఱుపక పోయినయెడలఁ గాలము గడచినకొలఁది నవి వినాశము నొందునో, యేమగునో, యనుసందియమున నానాముఖములఁ జెల్లాచెదరుగ నున్నవాని నన్నిటిని గ్రమక్రమముగా సమకూర్చి వసురాయచాటుప్రబంధ మనునామమునఁ బ్రకటించితిని. మనువసుచరిత్రాది ప్రబంధములయందుఁ బోలె నిందు నాదినుండి యంతముదనుక నేదేని పురాణగాథ గాని, కల్పితకథ గాని ప్రత్యేకము గానరాక పోయినను, విందునందు విస్తరిలోని వివిధరుచ్యపదార్థములవలె నిందలి చిన్నచిన్న ఖండకావ్యములు ప్రకృతివర్ణనములు, ప్రాస్తావికములు మొదలగునవి చదువువారి జిహ్వాల సంతుష్టిపఱుపఁ జాలియుండు నని తలంచెదను. తెలుఁగున నిట్టిగ్రంథ మిప్పటి కరుదు.

విషయసామ్యమునుబట్టి నాయీపద్యము లన్నిటి నైదుతరగతులుగా విభాగించి యాభాగములకు వరుసగాఁ బ్రశంసాప్రకరణము, ప్రకృతిప్రకరణము, ప్రాస్తావికప్రకరణము, ప్రకీర్ణప్రకరణము, స్వవిషయప్రకరణము, నని పేళ్ళుపెట్టితిని. ప్రకీర్ణప్రకరణములోని పద్యములు మాత్రమన్నియు స్వకపోలకల్పితములు కావు. అందుఁ గొన్ని సంస్కృతమునుండి

తెలిఁగించినవి. ఆవివరణ మాపద్యముల శీర్షికల వలనఁ దెలి

సంస్కృతకవులలో సుప్రసిద్ధపండితరాయ బిరుదాంకితుఁడగు జగన్నాథ కవి విరచించిన భామినీవిలాస మను గ్రంథ మించుమించుగా దీనివంటిదే. దానిని నేను తెనిఁగించి 1902 వ సంవత్సరమున ముద్రింపించితిని. వివిధ విషయములను గూర్చి వేఱువేఱు తరుణముల రచియింపఁబడిన యాశ్లోకములనెల్ల నొకసంపుటమునఁ గూర్చుటను గూర్చిన తనమనోభావము తద్గ్రంథాంతిమశ్లోకమున వింతగా జగన్నాథకవి వ్యక్తీకరించినాఁడు. పాఠకవినోదార్థము తచ్ఛ్లోకార్థము దెలుపు తెలుఁగుపద్య మిట నుదాహరించెదను.

క॥ అంజలిగొడుకులు వారియిం । పం జాతురు మామకీనపద్యమణు లటం
చుం జనియించినశంక న । మంజూషను దీనిఁ జేసినాఁడం జూండీ॥

మఱియుఁ దద్గ్రంథాంతమున నతఁడు రచించినయింకొక శ్లోకము నకుఁ దెలుఁగుపద్యము—

చ॥ నాకవితాకుమారి! వదనమ్మును వాంచకుమమ్మ! నిన్నుఁ బ
ల్గాకి నిరాకరించునని, గ్రాఁగును వాఁ డటు లోర్వలేమి; నీ
కాకథ యేల? కావ్యకమలాంతరసీధుధునీమధువ్రతా
నీకము లోలముం జెలఁగి నృత్యము నిత్యము నీ వొనర్పవే!

ఈచాటుప్రబంధమునం దితరవిషయవినోదములకంటెఁ బురాతనమును, బుణ్యతమక్షేత్రమును, లక్ష్మీసరస్వతీలాస్యరంగమును నయిన యీగౌతమీతీర రాజమహేంద్రవరనగరరాజమునకు సంబంధించిన విశేషము లెక్కుడుగా నెక్కొని యున్నవి. ఏనాఁడో యొకటిరెండుపద్యములు శ్రీనాథాదులీపట్టణమును గుఱించి వ్రాసినవి యిప్పుడు చదువుకొనుచు సంతసించెదు నాంధ్రుల కీకాలమునను, భావికాలమునను గూడఁ దత్పురీ విశేషము లనేకములు దెలుపునీచాటుప్రబంధపద్యములు డెందముల కమందానందసంధాయకములు కాకపోవని నాయాశయము.

గ్రంథస్వభావ మవగత మగుటకు నావశ్యము లయినకొన్ని వాక్యము లిట నేను బొందుపఱిచితిని. దీనిగుణాగుణములను గుఱించి పండితులే ప్రమాణము.

వడ్డాది సుబ్బారాయఁడు

ఇన్నీసుపేట, రాజమండ్రి.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి—3456_1000_28.

